-

దరిద్రం వదలని దయ్యాలు

ఎడుమ పక్క 88 - కుడిపక్క 88 గా బారులు తీరి దయ్యాలు నడుస్తూ వున్నవి . అవి బెండపూడి మీదుగా దొండపూడి వెడుతున్నవి . వాటి వెనుక పెద్ద సింహాసనం మీద కూచున్న ఒక కంకాళము తన ఊరేగింపు చేసుకుంటున్నది . ఈ సింహాసనాన్ని చచ్చిన అడవి దున్న ఒకటి మోస్తూ వున్నది . కాంకాలుడు ఈ మధ్యనే ఆ దయ్యాలకు నాయకుడు అయ్యాడు . వాడుఒకనాడు పాడుపడిన కోట దిబ్బలతో తిరుగుతుండగా భూమికి పదకొండు అడుగులకింద -తాచుపాముల పుట్టలో వాడికి ఈ సింహాసనం దొరికింది.

దయ్యాలు కాసేపు కోట దిబ్బల లో కాసేపు చింతల తోపులో కాసేపు శ్మశాననం లో కాసేపుచెరువు గట్టున తిరుగుతున్నవి . సింహాసనం మీద కూచున్న కంకాళ నాయకుడి పుర్రెలో ఏ ఆలోచనలు మెదులుతున్నాయో - దానికి అనుగుణంగా దయ్యాలు ప్రయాణిస్తున్నాయి .

తనకు ఒక సింహాసనం దొరికేసరికి - ఇది ఎందుకు నాకు దొరికింది ? నేనేమి చేయాలి అనే కొశ్చన్స్సు కాంకాలుడికి వచ్చినవి .అప్పుడు దయ్యాలలోని జ్ఞ్యానులను సమావేశపరిచి " " ఇదేమిటో చెప్పండయ్యా ?" అనడిగాడు . వారు " నువ్వు మాకు రాజువు కావాల్సిన రోజు వచ్చి - ఆ సింహాసనం నీకంటపడింది . దానిమీద కూచొని నేవ్వేమనుకుంటే అది జరుగుతుంది " అని చెప్పారు .

" సరే మంచిది నన్నేమి అనుకోమన్నారు ? అని కాంకాలుడు అడిగే సరికి వాళ్ళు " మన దయ్యాలు మంత్రగాళ్ళ చేతు,లకి చిక్కి గాజు సీసాలో బంధింపబడ్డారు , మంత్రపు దారాలతో ముళ్ల చెట్లకు కట్టి వేయపడ్డారు , పాతాళ భావుల్లోకి తోయపడ్డారు . ఇంకా ఘోరంగా కొందరు దయ్యాలను తమ సేవకులుగా చేసుకున్నారు . నీవు రాజు అయి వారినందరినీ విడిపించి విముక్తులను చేయుము . నేను అందుకే పుట్టాను అనుకోని నీ రాజ్యం నడిపించి పేరు పొందు " అని దీవించారు .

ఒక చోటుకి వచ్చే సరికి ఊరేగింపులో వున్నా దయ్యాలలో ఉత్సాహం వచ్చింది . - మనుషులు ఎవరూ మనలను చూడటం లేదు , అని అన్ని దయ్యాలు ఏకాభిపాయానికి వచ్చాయి . అప్పుడవి మూర పొడుగువున్న ఎముకలను చేతులో పట్టుకొని నోటి ముందు పెట్టుకొని - బుస్సు మని గాలి వూదాయి . ఎముకలు కాగడాలు వెలిగినట్లు వెలిగాయి . దయ్యాలు ఇప్పుడు మరింత ఉత్సాహంతో - కనపడ్డ కప్పలను ఎలుకలను పాములను - పాము గుడ్లను గుడ్ల గూబలను , గబ్బిళాయిలను తిని చప్పరిస్తూ .. బెండపూడి అనే ఊరివేపు దూసుకు వచ్చాయి.

<> బెండప్ప ది బెండపూడి మంత్రగాడు <>

బెండపూడిలోని ఊరిలోని దెయ్యాల మంత్రగాడు ఉచ్చోసుకందారి అని తలుపు తీసుకొని బయటికి వచ్చాడు . వచ్చిన పని వేరు కాబట్టి అతని చేతిలో మంత్రపు

కర్రలేదు -- అందుకని దయ్యాలు వాడ్ని లెక్క చేయకుండా వాడ్ని గుండెలమీద తొక్కుతూ - వాడి చేత రక్తం కక్కిస్తూ కాస్త నాట్యం చేసి - ఓరగా తెరిచినా తలుపులకుండా దూరి ఇంట్లోకి వెళ్లాయి .

<>మంత్రగాడు నిద్రపోవు విధము <>

బెండపూడి మంత్రగాడి భార్యకు జడుపెక్కువ . ఇంట్లో గాలి దయ్యాలు తిరుగుతున్నాయని భయపడుతూ ఉంటుంది. అందుమూలన్నీ నిద్రలో మొగుడినడుముని గోళ్ళతో చిరుతపులిలా గుచ్చి పట్టుకుంటుంది . జబ్బను పెద్దపులిలా పళ్లతో కరిచి పట్టుకుంటుంది " నీకేమీ భయంలేదు నేనున్నానుగా " అని చెప్పే దాని కనేసి ,కొంత సుఖంగా నిద్రపోదామన్న ఆశతో మరింత , మన బెండప్ప తన మంత్రాల కర్రను, పక్కలో తమ ఇద్దరి మధ్యా పెట్టి నిద్రోతాడు . బయట అల్లరి అదీ విని మంత్రగాడి భార్యకు బగ్గ భయం అయ్యింది . దాంతో చెమటలు ఆర్పుకుందుకు , ఏసీ ఫుల్లుగా పెట్టేసి గొంగళి బిగించి కప్పుకొని - ఎందుకైనా మంచిదని మొగుడి గారి యొక్క మంత్రాలు కర్రని గుప్పిట బిగించి పట్టుకొని నిద్ర నటించింది . అస్సలికే దయ్యంలాగావుండే ఈ ఆడది దయ్యాలని చూసి ఎట్లాగూ మొఖం పెదతాదీ? చూద్దారీ "అని " అంతేకాక దీనికి పోడుపాటి జుట్టూ ఉంటే కనుక పెరుక్కొని తీసుకెళ్లి సవరాలు అల్లించుకుందాము " అని ఆలోచించిన ఆడ దయ్యాలు గొంగళిని లాగి -పడే ప్రయత్నం చేశాయి . వాటికి వెయ్యి నొక్క వోల్టుల షాక్ అయ్యింది . చేతుల్లోని ఎముకలు బొబ్బలెత్తాయి . ఇదంతా మంత్రగాడి మంత్రాల కర్రకున్న పవర్ అన్న మాట . మంత్రగాడు చచ్చినా గూడా " మనమింకా దరిద్రము వదలని దయ్యాలమే అయినాము " అనుకుంటూ అవి తిరిగి సింహాసనాన్ని భుజాలకు ఎత్తుకొని బెండపూడి నుండి దొండ పూడి వైపు పరిగెత్తాయి .

<> కంది గుండు దయ్యాలు <>

దొండపూడిలో , బెండా పూడీ మంత్రగాడికి తండ్రి అయినా దొండప్ప-వున్నాడు. దొండప్ప ఆ ప్రాంతాల్లో ఘరానా పేరున్న మంత్రగాడు . . వీడి మంత్రాలకు మరీ పవరెక్కువ . దీతో పాటు వాడిలో చిలిపితనము కూడా ఎక్కువేను. నేడు దొండప్ప వంగీ లేవలేని ముసలాడు అయినాడు .. దొండప్ప ఒక సారి దారిని పోతూ - చెరువు గట్టు మీద దిక్కూ మొక్కూ లేకుండా - బిక్కూ బిక్కూ మంటూ కూచున్నా నాలుగు దయ్యాలను చూసి, వాటికి అన్నాలు పెడతాను అని ఆశపెట్టి ఇంటికి పిలుచుకో వచ్చి , అవి ఆదమరిచి అన్నాలు తింటూ ఉండగా తాను ఇంటిచుట్టూ తిరిగి, ముగ్గులు వేసి వాటిని తన ఇల్లు కదలకుండా భందించేసి , బానిసలను చేసుకున్నాడు . వీటి పనేమిటో భలే ఉంటుంది .

దొండప్ప మంత్రగాడు దయ్యాలను పురమాయించేసి ఒక్కొక్కటి ఫది టన్నుల బరువుండే రొండు గ్రానైట్ బండలను - దోనేపూడి క్వారీనుండి ఇంటికి తెప్పించేసుకున్నాడు . బండలదొంగెవరో తెల్వక క్వారీ వాళ్ళు బుర్ర గీక్కున్నారు .

దొందప్పకి దొండకాయ కూరతో పాటు కంది పచ్చడి అంటే ప్రాణం . నీచు తినొద్దు అని డాక్టర్ చెప్పిన నాటినుండీ ఈ పచ్చడి వాడికి మరింత ప్రాణం అయ్యింది . దొండప్ప గాడు పొద్దునే లేచి - పాతిక గ్రాముల కందిపప్పు - చింతపండు -

ఎండుమిర్చి - ఉప్పు వంటి పదార్ధాలు ఈ నాలుగు దయ్యాలకు ఇస్తాడు . అవి ఈ దినుసులను రొండు బండల మధ్యా వేసి మెత్తగా పచ్చడి నూరి మంత్రగాడికి అమర్చాలి . ఫది టన్నుల బండరాయిని కదులుస్తూ నిత్యా పచ్చడి రుబ్బటం - దెయ్యాలు ఒక కష్టం కాగా .. చెంచా అంత పచ్చడి తయారీ అయినా తరువాత- ఈ బండలను తీసుకెళ్లి చెరువులో ముంచి కడుక్కో రావటం దెయ్యాలకు అమిత కష్టమైన పనిగా మారింది . వీటి దీనమైన బ్రతుకు ల సంగతి ఎక్కడెక్కడి దయ్యలకు తెలిసి ఇవ్వంటే అందరికీ జాలిగా ఉండేది . ఇప్పుడు మన కంకాళ రాజు ఈ దయ్యాలను రక్షించి వాటికి మంచి రోజులు తెప్పించటానికి బెండపూడి నుండి దొండపూడికి ఆఘ మేఘాల మీద సవారీ వస్తున్నాడు - A ORIGINAL BY VARANASI SREE RAMA .

<> ఇంటి వారి సాయం <>

వాకిట్లోకి వచ్చి నిలబడ్డ కాంకాలుడికి కందిగుండు దయ్యాలు తలుపులు తెరిచి స్వాగతం పలికాయి . దొండప్ప బాగాతినీ , బాగా తాగి , ఆపై నల్లమందు చప్పరిస్తూ పడుకోవటం వల్ల ఈ లోకపు స్ప్రుహలో లేడు . అందువల్ల ఎంత రచ్చ రచ్చ జరిగినా నిద్ర లేస్తలేదు .

కందిగుండు దయ్యాలు తమ దెయ్యాల నాయకుడికి ఇట్లా చెప్పాయి ' వీడి ప్రాణాలు వీడిలో లేవు . పెరటిలో వున్నా కొత్తిమీర మొక్కల్లో తన ప్రాణాలను దాపెట్టాడుఅని మా అనుమానం . మేము ఇల్లు కదలలేము . మీరు ససైన్యంగా వెళ్లి పెరటిలో ఒక్క మొక్క కూడా లేకుండా పీకేయండి . సరైన మొక్కను పీకినప్పుడు ఇక్కడి వీడి తల నరాల్తో సహా మొండెంనుండి వేరు అయి మనచేతికి వస్తుంది . అప్పుడు మనం వాడితో ఆటలాడుకోవచ్చు " అని చెప్పాయి .

కాంకాలుడు తన 88 +88 అనుచరులతో కలిసి, ఒక్క క్షణం లో పెరటిలో ని కొత్తిమీర మొక్కలన్నీ పీకేసాడు .{ అప్పటినుండి పీకావులే కొత్తిమీర కట్ట - అన్న సామెత పుట్టింది }

సరైన మొక్క పీకినప్పుడు దొండప్ప తల మొండెంనుండి వేరుపడింది . మెడలోని నరాలు ఆరు అడుగుల పొడుగుగా వేలాడాయి .

" శత్రువుని వధించినాము -ఇంకా ఆ దరిద్రుడి తల మనకెందుకు - అవతల పారేయండి . వాళ్ల వాళ్ళు పూడ్చుకుంటారో కాల్చుకుంటారో ? అని కాంకాలుడు ఆర్డార్లు వేసాడు

<> సూర్యనందా భండారారి వారి గ్రంధము <>

అప్పుడు కందిగుండు దయ్యు ఇలా విన్నవించాయి . రాజా మేము ఈ దొండపా గాడి ఇంట్లో బందీగా ఉండగా - ఎక్కడా చోటు దొరక్క అటకమీద -ఒకరిమీద ఒకరంగా - రొట్టెల దొంతర వాలే పడుకునేవాళ్ళము . ఒకనాడు "సూర్యనందా భండారారి "వారి మంత్ర గ్రంధము ఒకటి మాకు ఆ అటక మీద కనపడింది . వారు మన దయ్యాల పాలిటీకి పూజ్యులు. వీరు దయ్యాలు నేర్చుకోవాల్సిన మంత్రాలు అనేకం రాశారు . మేము అవన్నీ నేర్చుకొని వాటిని వేదాల లాగా వల్లెవేసి - భట్టీయం వేసాము { ఇక్కడనుండి దెయ్యాలు వేదాలు వల్లే వేయటం అనే మాట పుట్టింది } మాకు అనుమతి ఇస్తే ఈ తలచేత అనేక పనులు చేయిస్తాము "

" మీవంటి విద్వత్ కల వారు నాకు కొలువులో ఉండటం అవసరం . మీకు బహుమతిగా నా శత్రువు దొండపాగాడి బాడీని మీకు బహుమానం చేస్తున్నాను . పచ్చిగా తింటారో - నెత్తురు జుర్రుకుంటారో , వేపుకొని తింటారో చెప్పండి . వంట చెపిస్తాను " అని చెప్పి వాళ్లకు  మంత్రి పదవులు ఇచ్చాడు .

< ఒడలు బళ్ళు అగుట - దొండపాగాడి రాత మారుట <>

దొండపా గాడి తలను వూరేగించుకుంటూ తెల్లారకట్లకల్లా దెయ్యాలన్నీ పాడుబడిన కోటదిబ్బల మీద వున్నా రావి చెట్టుకిందకు చేరుకున్నాయి .

ఈ సరికే కంది గుండు దయ్యాలు మంత్రుల హెూదాతో మిగిలిన దెయ్యలతో మాట్లాడి వారి సమస్యలను అడిగి తెలుసుకున్నాయి . " ఈ మధ్య వస్తున్నా అత్తా కోడళ్ల టీవీ సీరియల్స్ లో . అత్తా పాత్ర ను చూసి స్ఫూర్తి పొందిన వారు - చచ్చి మనలో చేరుతున్నారు . వీరు యాష్టిట్యూడ్ వల్ల మాకు చాలా గోరంగా కలం గడుస్తోంది . వీటిని మేము కంచు కట్ల దయ్యాలు అని పిలుచుకుంటున్నాము . ఈ కంచుకట్ల దయ్యాలు మనలో కలవకుండా ఏర్పాటు చేయండి " అని కోరాయి .

<> కంచు కట్ల దయ్యలా  కట్టడి కి  - దొండప్ప గాడి కావలి <>

అప్పుడు కందిగుండు మంత్రులు చక్కని సమాలోచన చేసి -సూర్యనందా భండారారి వారి గ్రంధముతిరగ వేసి తగిన మంత్రం కోసం చూసారు . ఇక దానిప్రకారం .. దొండపా గాడి తలను ఒక సూలానికి గుచ్చి - ఇంతింత కర్పూరం ముద్దలు వెలిగించి వాడి కళ్ళలో దూర్చాబు. అప్పటినుండీ దొండపా గాడు సూలం ఒక్కటే తన దేహంగా , కళ్ళలో కాంతులు వెదజల్లుతూ , కంటికి రెప్పవేయకుండా - దయ్యలా మర్రిని - కోటని - చెరువుని - దెయ్యాల రావి చెట్టుని 24X7   గట్టిగా మాటాడితే 365X24 కాపలా కాయసాగాడు .

ఈ రకంగా  కంది గుండు దయ్యాలు తాము ఎదుర్కున్న హింసకు తగిన ప్రతీకారం తెరుచుకున్నట్లు  అయ్యింది . ఈ ఏర్పాటు చూసి దయ్యాలు ముక్కున వేల్ వేసుకొని మంత్రులకు జేజేలు పలికాయి .

కథ   ఇంతటితో ముగిసింది అని చెప్పలేను . దరిద్రం వదలని దయ్యాలు అని కథ పేరుగదా ? దయ్యాల  దరిద్రము ఇంకా వదలకుండా .. బెండప్ప మంత్రగాడి భార్య చేతుల్లో వున్నా మంత్ర దండము రూపంలో ఇంకా ఉందనే వుంది  కదా ? వేరే మంత్రగాడెవరన్న ఆ బెండప్ప మంత్రదండాన్ని చేజిక్కించుకొని ప్రాక్టీస్ మొదలు పెట్టవచ్చు గదా ? అప్పుడు మన గతి ఏమిటని - ఇంకా మన దరిద్రము వదల్లేదని దయ్యాలు కబులు చెప్పుకున్నవి.

<> రామకృష్ణప్ప - ఎడ్వెంచర్స్ <>

మంత్రుల చెవికి ఈ విషయం సోకింది . వారు ఏమి చేశారంటే - రామకృష్ణప్ప అనే చిన్న కుర్రవాడిని చేరతీసి - వాడి ద్వారా ఆ మంత్రపు కర్రను తస్కరణ చేసి - ఆ కర్రను - జాన పొడుగు ముక్కగా - మూర పొడుగు ముక్కగా - బారపొడుగు ముక్కగా మూడు ముక్కలు చేసి

కుర్రవాడికి ఇచ్చి - వీటి సహాయంతో వాడికి రాకుమారితో వివాహం అయ్యేట్లు చేసి - ఆనందించారు - ఈ కధ అనగా రామకృష్ణప్ప ఎడ్వెంచర్స్ నేది తొందర్లో వస్తది . బహుశా దీని మీద మీ తీర్పు ఛూసినంక వస్తాది గావొచ్చును .

--------------------------------------------------

సూర్యుని ఆవు/గోవు 15-09-22
సూర్యుని నుండి ఒక గోవు వచ్చింది . అది ఎందువల్లో మన దేశము రాలేదు . అందువల్ల ఇది ఆధ్యాత్మిక వ్యాసం కాదు . ల్యాండ్ అఫ్ ది సన్ అని చెప్పుకునే వారి దేశం లోకి వచ్చింది . అందువల్ల ఇది అసామాన్య విషయం మీద ఒక సామాన్య వ్యాసము . వీరు ఈ ఆవును తీసికెళ్ళి ఆఫ్రికా అడవుల్లో వదిలారు .అడవుల్లోమనుషులు వుంటారు కానీ కర్రెంట్ ఉండదు - అని మీరు ముందుగా గమనించాలి. ఈ ఆవు సంగతిని టైమ్స్ మేగజైన్ - అమెరికా వారు గుర్తించి, ఆవును ఎంతో పొగిడి - ఆఫ్రికాకు ఆవుల పండగ వచ్చింది అన్నారు
.
<> కొన్ని విషయాలు <>.
ఒక కుర్చీ గానీ టేబుల్ గానీ మామూలుగా ఉంటే పట్టించుకోము . అదే మంచి డిజైను తో ఉంటే దాన్ని గురించి వందసార్లు అలోచించి ఆ రూపాన్ని మనస్సులో ముద్రించుకుని అడిగి మరీ కొనుక్కుంటాము .<> దీని అర్ధం ఏమిటంటే మంచి డిజైను అనేది అందరినీ ఆకర్షిస్తుంది . మరియు డిజైను అన్నదానికి ఎంతో పవర్ వున్నది .
ఒక వస్తువు ఇంటి అవసరాలకు పనికి వస్తుంది అన్న భావన మనకు కలిగినప్పుడు - ఆ వస్తువుకు మనము అంటకట్టే విలువ ఎంతో ఎక్కువగా ఉంటుంది . దీని ప్రకారం మనము ప్లాస్టిక్ కొంటైనేర్ లో వుండే ఫుడ్ కొనటానికి మొగ్గు చూపుతాము .
<> సూర్యుని ఆవు రూపము- వర్ణనము <>
నిజమైన ఆవు ఎంత ఉంటుందో అంతే సైజు లో ఓ ఆవు బొమ్మని తయారు చేశారు . దీనికి వీపు మీద పొట్టకు రెండు పక్కలా సోలార్ పానెల్స్ ఏర్పాటు చేశారు . ఆవు పొదుగు కింద పాలక్యాను ను పోలిన పెద్ద తెల్లని ఛార్జింగ్ బ్యాటరీ ఉంటుంది .సోలార్ పవర్ ద్వారా తయారు అయినా విద్యుత్- పాల ధారలవంటి తెల్లని కర్రెంట్ వైర్ల ద్వారా ఈ పాలక్యాన్ వంటి బ్యాటరీలోకి ఛార్జింగ్ అవుతూ ఉంటుంది .ఈ ఆవు ను చిన్న చిన్న ఛెక్రాలు బండి మీదపెట్టి - స్కూల్ పిల్లలకోసం అని స్కూళ్లల్లో కట్టి వేశారు .
డిజైన్ అనేదానికి ఎంతో ఆకర్షణ శక్తి వుంది అని మొదటిలోనే చెప్పుకున్నాము . అందువల్ల స్కూల్ అంటే ఇష్టపడని పిల్లలు కూడా ఈ ఆవుడిజైను కి ఎట్రాక్ట్ అయి స్కూల్లో పేర్లు నమోదు చేయించుకో సాగారు . ఈ రకంగా పిల్లలని స్కూల్ వైపు ఆకర్షించటం జరిగింది .
స్కూల్ కి వచ్చిన పిల్లలను స్కూల్ లోనే కూర్చునేట్లు ప్రోత్సహించటం ఎలాగ్గా? అప్పుడు ఏమిటంటే పిల్లలకు సోలార్ పవర్తో పని చేసే టార్చిలు , బల్బులు, మ్యూజిక్ బాక్స్ లు వంటివి అందచేశారు . పిల్లలు బడికి వస్తూనే తమ దెగ్గర

వున్నా ఈ ఛార్జింగ్ వస్తువులను ఆవు పొదుగుకింద వున్నా పాలకానుకు వున్నా ఛార్జింగ్ పాయింట్స్ లో పెట్టుకొవాలి . క్యాను చుట్టూ వందకు వరకూ ఛార్జింగ్ పాయింట్స్ ఉంటాయి. పిల్లలు క్లాసు లోవుండి పాఠాలు నేర్చుకుంటూ ఉండగా వారి వస్తువులు ఛార్జింగ్ అయిపోయి ఉంటాయి .
తమచేతిలో వున్నా చార్జుడ్ టార్చ్ లైట్ లు పట్టుకొని పిల్లలు రాత్రి సమయాలలో పొలాలమీదకు వెళ్లి సరదా చేసుకుంటారు . తమ చార్జుడ్ బ ల్బుల వెలుగులో చెడుగుడు ఆడుకుంటారు . పాఠాలు చదువుకుంటారు . చార్జుడ్ మ్యూజిక్ బాక్స నుండి మ్యూజిక్ విని గంతు లేస్తారు
.
ఇందుకోసమని అంటే ఈ అవుమీద మోజుతో - దాని పాలు అనతగ్గ విద్యుత్ ని ఎంజాయ్ చేయటానికి - అని పిల్లలు ప్రతి రోజూ క్రమం తప్పకుండా స్కూలు కి వస్తూ వుంటారు . క్రమంగా అలవాటు పడిబుద్ధి వంతులైన విదార్థులు అవుతారు . బడి కి పోకుండా గొడ్లు కాయటానికి మొగ్గుచూపే పిల్లకాయలుకూడా వుంటారు . వాళ్లకి కూడా ఈ ఆవులో ఆకర్షణవుంది . ఈ ఆవులను తోసుకుంటూ ఎండలో నిలబెట్టటం . సౌరశక్తి సోలార్ పానెల్స్కి తగిలేవిధంగా అవును కదల్చ్చం , వర్షం వచ్చినప్పుడు ఆవులను స్కూల్ షెడ్లోకి తెచ్చి కట్టి వేయటం వంటి పనులు , గొడ్లు కాస్తూ తిరగాలనుకునే పిల్లలకి అప్ప చెపుతారు . ఈ రకంగా వీరు తమ సరదా తీర్చుకుంటూనే స్కూల్ పాఠాలు చదువుతారు .
ఇక ఆడపిల్లలను స్కూల్ ముఖం చూడనివ్వకపోవటం అనేది ఆ దేశంలో కూడా వుంది . ఈ సూర్యిని ఆవు వున్నా స్కూల్ లో డపిల్లలకు CHARGING తో పని చేసే హెయిర్ డ్రెస్సేర్ , టీ కెట్టిల్, టాబ్ , చిన్న రేడియో , టీవీ వంటివి ఇస్తారు . ఈ హెయిర్ డ్రెస్సేర్ ని తల్లులూ వాడుకుంటారు . ట్యాబ్లో ముందుగా ఫీడ్ చేసిన సౌందర్య చిట్కాలు హెల్త్ టిప్స్ వంటివి అనేకం ఉంటాయి . ఇవ్వి తల్లులకు ఆకర్షణ గా ఉంటాయి . తండ్రులకు రేడియో నచ్చుతుంది . టీవీ కుంటుంబాని కంతా నచ్చుతుంది . అందువల్ల ఆడ పిల్లల తల్లులు , తమ భర్తలతో గొడవపడి అయినా సరే పిల్లలను బడులకు తోలుతారు .రేడియో లకు ఆశపడి తండ్రులు వూ కొడతారు .
ఒక ఐడియా జీవితాన్ని మార్చేసినట్లు - ఒక డిజైన్ కూడా జీవితాలని మార్చేస్తుంది .
<> మీ సందేహాలు - నాకు తోచిన సమాధానాలు <>
బడి లో చేరిన పిల్లలను పట్టి- ఒక్కో బడిలో ఐదారు ఆవులు ఉంటాయి .ఇంకా కావాలంటే ఇంకా సప్లై చేస్తారు .
పిల్లకు ఇచ్చే పరికరాలు అన్నీ - అక్షరాస్యతను పెంపొందించాలి అని కంకణం కట్టుకున్న సేవా సంఘాల వారు సమకూరుస్తారు . పరికరాలని పిల్లలకి ఉచితంగా ఇస్తారు .చెడిపోతే రీప్లేస్ చేస్తారు .
ఈ ఆవులన్నీ - ఎటువంటి ఎలక్ట్రిసిటీ అందుబాటులో లేని - లేక అధికంగా అంటే రోజుకు పద్దెనిమిది గంటలు లేదా అంతకు ఎక్కువ కరెంట్ కోత వున్నా ప్రాంతాలలోనే ఏర్పరుస్తారు - అందువల్ల పరికరాల ఛార్జింగ్ కోసమని పిల్లలు తామంతా తాముగా బడికి వస్తారు - లేదా తల్లులు పిల్లలని బడికి తోలుతారు .
ఈ పరికరాలని సోలార్ ఆవు నుండి మాత్రమే ఛార్జింగ్ చేసుకునే విధంగా మార్పులు చేసి రూపొందిస్తారు . మీరు అనుకున్నట్లు స్కూల్ బయట పప్పులు ఉడకవు .
**A ORIGINAL BY VARANASI SREE RAMA KRISHNA**
నీతి = ఏది రూపొందించినా అందంగా ఆకర్షణగా రూపొందించాలి

-----------------------------------------------------------------------

కమ్మని కలలయ్యా .....14-09-022

క్లాసు గల ఒకాయన గ్లాసు ముందుపెట్టుకుని మందు విందుకు రెడీ అవుతున్నాడు .

భార్య చూస్తూనే వుంది " ఎక్కడో తాగి ఎంతో ఖర్చుపెట్టి . ఎక్కడో పడి పోయే బదులు - ఈ యన ఇంట్లో ఏడిచిందే మేలు " అని ఆమె ఎన్నడో తీర్మానం చేసికొని శాంతం గా కాలం గడపటం అలవాటు చేసుకుంది . ఇప్పుడు ఆమె టీవీ సీరియల్ చూసుకుంటూ వుంది

" శాంతా ఇల్లా రా " అని అయన హుంకరించాడు
" అక్కడకాదు ఇక్కడ . నా ఎదురుగా . నా చేతికి అందుబాటులో కూచో " అని మరో సారి హుంకరించాడు.

" సరే గానీ .నిన్న రాత్రి కలలో నాకు ఎమ్మెల్యే టికెట్ దొరికినపుడు - వూరు వూరు అంత వచ్చి . నాకు జై జై లు కొట్టారు. నువ్వు మాత్రం కొట్టలేదు . అందుకని నిన్నిప్పుడు కొడదామని ఫిక్స్ అయినాను - వెనక్కి తగ్గేదే లే " అంటూ భార్య దవడ మీద ఒక్క పీకు పీకాడు .

ఆమె ఎంత శాంతం వహించటానికి వీలుందో అంత శాంతమూ వహించింది .

మరునాడు - భర్త మందు స్టార్ట్ చేయగానే శాంత ఎదురుగా వచ్చి నిన్నటి పొజిషన్ లోనే కూచుంది .

" మహా సాధ్వి - నామనసు అర్ధం చేసుకుంది" అని భర్త గారు మురిసారు. ఆమె కొంగు మాటున ఏమి దాగి వున్నదో ఆమెకు తప్ప మరొకరికి తెలవదు .

" ఏమండీ నిన్న రాత్రి కలలో నన్ను అమ్మవారు పూనినప్పుడు వూరు ఊరంతా వచ్చి నా ముందు సాగిలా పడి మొక్కారు . మీరు మాత్రం మొక్కలే . సరే ఇప్పుడు మొక్కండి - లేదంటే ఇంటికి అరిష్టం . ఇక మీ తప్పులు కాయలేను " అంటూ శాంత . కొంగు చాటునుండి తిరగమాతలకు వాడే ఇనుపగంటే తీసి మొగుడి బట్టతల మీద మోదింది
" నా తప్పులు కాయి ఓ అమ్మ తల్లీ " అంటూ భర్త ఆమె ముందు మోకరిల్లాడు . ఒక పట్టుచీర మొక్కాడు .

**DREAMING IS EVERYBODYS RIGHT SIR .**

**A ORIGINAL BY VARANASI SREE RAMA KRISHNA- AMARAVATHI**

----------------------------------------------------------------------------------------------------------
--

<>ఒకానొక వూరిలో<> { రెండో భాగము }

ఈ కథ యొక్క మొదటి భాగము NEXT టైం NEXT PART - అన్న మాటలతో

ముగించబడింది . దాని తరువాత కథ ఇది

ఈ కథ నేను 31 /.8/22 ఆపివేసాను . మిగితా కథ రాయమని చాలామంది ప్రోత్సాహాన్నిచ్చారు లైకులు చేశారు, కామెంట్స్ పెట్టారు షేరు - చేసుకున్నారు . అసలు ఎందుకు ఆపాను అంటే- జనంలో ఏదో సస్పెన్సు క్రియేట్ చేసి మార్కులు కొట్టాలని కాదు . ఇతర ఉద్దేశ్యాలు కూడా ఏమీ లేవు . కథ ఇంతవరకూ రాసే సరికి మా తల్లి గారు మరణించింది అన్న కబురు వచ్చింది . అదీ సంగతి . నేను కథను సగంలో ఆపివేసినందుకు నాకు ఏవో దురుద్దేశాలని అంతకడుతూ ఎవరూ విమర్శ చేయలేదు . అందుకు సంతోషం . జీవితం అంటే ఇట్లానే జరుగుతూ ఉంటుంది.

<> కధకి కొనసాగింపు <>

వడ్రంగి చాలా కాలం నదీ రాజ్యంలో కాలం గడిపినాక, అతనికి భూమి మీదకు పోవాలని తన ఇంటిమీద ఇల్లాలి మీద మనస్సు మళ్ళి . విచారంగా ఉండసాగాడు . . నదిలో వుండే రాకుమారి ఇతని విచారాన్ని గ్రహించి అతనికి వీడ్కోలు పలికింది . వీడ్కోలు బహుమతిగా ఆమె ఒక దంతపు పెట్టెను వడ్రంగి చేతిలో పెట్టి " నీవు ఇంటికి వెళ్ళే వరకూ దీన్ని తెరిచి చూడకు . ఈ పెట్టె ఒక్కసారి మాత్రమే తన మహిమ చూపుతుంది . నీ మనో భావాన్ని గ్రహించి నెరవేరుస్తుంది . నీవు ఇల్లు చేరినాక ఈ పెట్టె తెరువు - మేలు అవుతుంది " అని చెప్పి - అతన్ని నదీ తీరంలో దింపి వీడ్కోలు పలికి వెళ్ళి పోయింది

వడ్రంగి ఇంటికి వచ్చి తన ఇల్లు పాడు పడి పోవటం , భార్య జాడ ను ఎవ్వరూ చెప్పకపోవటం వంటి వాటివల్ల ఒకటి రొండురోజులు పిచ్చిగా తిరిగాడు . వడ్రంగి వున్నట్లుండి వూరిలో కనపడటం . అతని చంకలో ఏదో చక్కని పెట్టె వుండటము - దుడుకు గాడు గమనించాడు . అతడు వడ్రంగిని వెన్నంటి తిరుగుతూ అతని చేత పెట్టె మూత తెరిపించాడు . వడ్రంగి పల్లె వాడైనందున అతని ఆలోచనలుఎప్పుడూ , మంచి జవసత్వాలు కలిగి పాడి పంటా వంటి విషయాలను నిర్వహించుకు రాగల సమర్ధురాలైన కూతురిని కోరుకుంటూ ఉండేవి . ఆ ఆలోచనలలోనో వున్నాడు . అందువల్ల పెట్టె తీయగానే మంచి వయసున్సతో , ధృడమైన దేహంతో, శక్తి వంతం గా వున్నా ఒక చక్కని యువతీ అందులో నుండి బయటకి దూకింది. . . వడ్రంగి ఆలోచన్లకు అనుగుణంగా నే ఈ యువతి ఉద్భవించింది .ఆమె పెట్టెలోనుండీ బయటకు వస్తూ నే " నాన్నా " అని పిలిచి వడ్రంగిని కౌగలించుకొన్నది .

. పెట్టెలో ఏవో వజ్ర వైఢూర్యాలు ఉంటవి అని ఆలోచన లో వున్న దుడుకు గాడు ఈ యువతిని చూసి భయపడి పరుగు తీసాడు . కానీ భయం తగ్గినాక వాడి మనస్సు ఈ యువతిని కోరుకుంది . నా నిప్పుల బాణము తో -శక్తి వంతమైన ఆ యువతి ని గెలిచి పెళ్లాడుతాను అని తలపోశాడు .

యువతి చేతిలో - ఒక వంకర కర్రవున్నది. అది ఆవులు కాచుకునే వారు వాడేది .ఈ యువతిని సంభవి అందాము . ఆమె దంతపు పెట్టెలోకి చేతులు పెట్టి, చిన్న చిన్నఆవులు ఎద్దుల బొమ్మలు అనేకం బయటికి తీసి వాటిని నేలపై పెట్టి తన

క్రతో తాకింది . అవి సజీవంగానూ పెద్దగానూ అయినాయి . సంభవి ఒక కొమ్ము బూర తీసి ఒక దిక్కుకు ఊదగానే ఇవన్నీ కలిసి మేతకోసమని అడవిదిక్కుకు పరిగెత్తి పోయాయి . అవి సాయంకాలానికి ఇంటికి తిరిగి వచ్చి కడవలు నిండా పాలు ఇచ్చాయి . సంభవి వాటిని తిరిగి చిన్నవిగా చేసి తిరిగి పెట్టెలో భద్రంచేస్తుంది . పాలు పెరుగు వెన్న నెయ్యి వంటివి చేసి అమ్మి తండ్రికి ఆదాయం కూర్చి పెట్టి - ఆ ఆదాయముతో చక్కని ఇల్లు నిర్మించింది .

<> సంభవి పశువులను మేపు విధము <>

సంభవి ఏనాడు పశువుల కాపుకు వెళ్ళింది కాదు . ఇంటిలో ఉండి తండ్రితో మాట్లాడుతూనే , వండిపెడుతూనే గో సంరక్షణకు అవసరమగు అన్ని పనులు చక్కని చేసుకునేది . ఆమె తలలో ఎప్పుడూ ఒక దువ్వెన ఉండేది .అడవిలో ఆవులు కదులుతున్న దిక్కును అనుసరించి ఈ దువ్వెన ఆమె జుట్టులో కదులుతూ ఉండేది .తనకు ఇష్టము కానీ దిక్కుకు పశువులు మళ్ళినప్పుడు - సంభవి తలలోని దువ్వెనను సరి చేసుకుంటే చాలు పశువులు ,ఆమె కోరిన దిక్కునకు మళ్ళి పోతూ ఉండేవి . సంభవి ఆ దువ్వెనను చేతిలో పట్టుకొని దాన్ని మీటింది అంటే ఆవుల మంద చుట్టూ పెద్ద కంచె ఏర్పడి , వాటికి పులుల వంటి క్రూర మృగాలనుండి ఆపద రాకుండా కాపాడేదిదుడుకుగాడు సంభవి ఆవుల మందలో ఏదో రహస్యము వున్నదని గ్రహించాడు . ఆ ఆవుల మందను నాశనం చేస్తే గానీ ఆమె తన దారికి రాదనీ కూడా ఆలోచించాడు . దీనికోసమని ఊరి మంత్రగాడిని కలిసి కొన్ని రక్షా రేకులు కూడా పొందాడు . అలా పొంది ఒకనాడు కొందరు దుష్టులను కలుపుకొని ఆవులపై దాడి చేసి. వాటిని ఎండిపోయిన గడ్డి చెట్లు వున్నా వైపు మళ్లించి ఆ గడ్డికి నిప్పు పెట్టాడు . సంభవి ఇంటినుండి బయలు దేరి ఆవుల మంద దగ్గరకి వచ్చింది . వాటికి భయం లేకుండా చేయటానికి అని .ఆమె తనదువ్వెనను వుపయోగించి ఆవులచుట్టూ అనేక అంచెల కంచె నిర్మించి - తానూ పోయి ఆవులతో నుంచుంది . ఇదే సమయమని దుడుకు గాడు తన నిప్పుల బాణం వేసి అడవి నలువైపులా నుండీ భగ భాగా మండెట్లు చేసాడు . మీకు ఇంతకు ముందు చెప్పలేదు కానీ సంభవి వద్ద ఒక్క ఎర్ర చేతి రుమాలు వుంది . అది ఎప్పుడూ ఆమె బొడ్డులోనే ఉంటది . ఆమె దాన్ని తీసి ఆకాశంలోకి విసిరి వేసింది . ఆ రుమాలు పెద్దా మేఘంగా మారి వర్షాన్ని దిమ్మరించి మంటలను ఆర్పివేసింది . తాను ఆపదనుండి తప్పుకొని - ఆవులను ఆపదనుండి తప్పించి - అడవి మరొక చివరికి చేరి - అక్కడ కనపడుతున్న ఒక పెద్ద ఆశ్రమము వంటిదానిలోకి ప్రవేశించి - తన దువ్వెనను మరలా వుపయోగించి - ఆ ఆశ్రమము భుట్టో పెద్ద కంచె నిర్మించింది . అడవి తగల బడటం ఆగినాక , దుడుకుగాడు కూడా సంబవిని వెన్నంటి వచ్చి ఆశ్రమము చేరాడు . మరలా తన అగ్ని బాణాన్ని ఎక్కుపెట్టాడు . అప్పుడు ఆశ్రమంలోనుండి ఒక నవ యువకుడు వెలికి వచ్చాడు . అతడు ఎవరో కాదు. దుడుకు గాడికి శత్రువు లాంటి కిట్టప్పయే .అప్పుడు కిట్టప్ప కలుగచేసుకొని - వడ్రంగి ద్వారా తనకు లభించిన ఐదు ములికీల బాణాన్ని - దుడుకు గాడిపై వేసాడు .

వింటినుండి వెలువడిన బాణము ఐదు భాగాలుగా విడిపోయి - ఒకటి వెళ్లి దుడుకు గాడిని చంపింది .మరొకటి దుడుకు గాడికి రక్షా రేకు ఇచ్చిన మంత్రగాడిని చంపింది.ఇంకొకటి వెళ్లి వండ్రంగి భార్యను నమిలి తిన్న నక్కను తాకింది . నక్క చనిపోగానే దాని రక్తం లోనుండి వడ్రంగి భార్య తిరిగి మామూలు గా బయటికి

వచ్చింది . నాలుగవది ఆ దేశాన్ని పాలించుతూ వున్నా దుష్టుడైన రాజుకు తగిలింది . దీనికి ప్రజలు కిట్టప్పను మెచ్చి తమ రాజును చేసుకున్నారు. ఇక ఐదవబాణము ఆకాశములో చెక్కెర్లు కొడుతూ - కిట్టప్పకు ఎవరన్నా శత్రువు మొలుచుకు వస్తే వా రి పని పట్టటానికి చూస్తూ వున్నది .
కదా సుఖంతం ఎట్లా అవుతుందో నేను మీకు చెప్పా పని లేదు . కిట్టప్ప - సంభవి రాజు రాణి అయినారు . ఒక ఊరిలోని వడ్రంగి , ఆ దేశపు రాజుగారికి మామ గారు అయ్యి - అఖండురాలైన కూతురి ప్రేమా ఆధారణలతో తడిసి ముద్ద అవుతూ , కోరినది తింటూ హాయిగా జీవించసాగాడు . వడ్రంగికి షుగర్ లేకపోవటం వల్ల ఏదైనా , ఎంతైనా తినేందుకు వీలుండేది . ఆయనకు షుగర్ రాకుండా ఉండటానికి అని సంభవి తన పెట్టెలోనుండి ఒక ఇసుక రేణువు అంత మందు తీసి ఇచ్చేది . ఒక్క రేణువుతో ఒక్క సంవత్సరం పాటు షుగర్ కంట్రోల్ లో ఉండేది .
చాలు అనిపించి ముగించాను - ఇంకా సాగతీతకు వీలుందని మీరు గ్రహించివుంటారు . , నిమ్మది మీద ఇల్లాంటిదే ఇంకో కథ అల్లుతాను . ఈ కథ నా సొంత అల్లికే గానీ దేనికి కాపీ గానీ అనుసరణ కానీ కాదు - THIS IS A ORIGINAL BY SREE RAMAKRISHNA VARANASI . OF AMARAVATHI . ----------------------------------------------------------------

<> ఏడురూపాయలకే -- ఏడంతస్తుల మేడ <> ..

ఒకానొకనాడు - ఒకానొక వూరిలో - తనకున్న ఒక్క గా నొక్క దేవాలయాన్ని చూసి సంతోషించుకుందారి అని బ్రహ్మదేవుడు వస్తూ వున్నాడు . వస్తున్న న్న దారిలో ని ఒక శిథిల గృహం నుండి కమ్మని "పప్పుచారు" వాసన రావటం వల్ల ఆయన ఆఇంటి వద్ద ఆగి "ఎవరీఅదృష్ట గృహస్థు? " అనుకుంటూ - గోడలోనుండి లోపలి కి చూసాడు . అక్కడ ఒక డు విస్తరి ముందుభోజనానికి అని కూచొని , అన్న మో రామచంద్రా అన్నట్లు భార్యవంక చూస్తూ వున్నాడు . . ఆమె కట్టెల మంటతో పప్పు చారు ఉడికించుతూ " " దోరికాడురా- మిడతంబొట్లు " అన్నట్లు భర్త వంక చూస్తూ - పొయ్యిలో ని మంటను , తన మనస్సులోని కోపాన్ని ఎగతోసుకుంటూ వున్నది .

కావాలని వంటను జాప్యం చేస్తూ ఉంది

బ్రహ్మ మోగా మా నిషి ఎవరో బ్రహ్మ తృటిలోనే గుర్తు పట్టాడు . అతడు . బ్రహ్మ దేవుని గుడి యొక్క పూలారి. బ్రహ్మ అంతటివాడు" పూజారి "అన్న మాటకు బదులు" పూలారి"అన్న మాట వాడాడని అనుకోలేము.

రాజులచే ,నిత్యమూ గుడిలో పూజకు ఏర్పాటు చేయబడిన మనిషి పూజారి అయినట్లు ఒక రాజు ఒక్క ఆజ్ఞతో , ప్రతి నిత్యము కొలనునుండి ఒక బ్రహ్మ కమలాన్నితీసుకు వచ్చి బ్రహ్మకు సమర్పించ వలసిన భాద్యత నెత్తిన పడ్డ ఈ వ్యక్తి పూలారి అయినాడు .

పూర్వము ఎప్పుడో ఒక గొప్ప రాజు, ఎదో అవసరాతో బ్రహ్మ తో కూడిన సరస్వతి యొక్క - ఒక ఆలయము , దాని పక్కనే ఒక కొలను నిర్మించి అందులో బ్రహ్మకమలాలను పెంచింప చేసాడు . ప్రతి ఉదయము కొన్ని కలువపూవును తెంపి బ్రహ్మకు సమర్పించే దానికి అని ఒక మనిషిని పెట్టాడు . ఆపని చేయు మనిషియేమన పులారి .

పులారి తన పని చేసినందుకు గాను మొదటిరతరపు రాజు ఇతనికి నెలకు అర్ధరూపాయ జీతము - ఫది ఎకరాల మాగాణి భూమీ ఏర్పాటు చేశాడు . రాజులలో మూడో తరము వచ్చేసరికల్లా బ్రహ్మ గుడి రాజు సంతతి యొక్క ఆదరణ కోల్పోయింది . అర్ధరూపాయి జీతము అనేది - పైసాకు బస్తా బియ్యము లభించే రోజులలో ఇచ్చిన జీతము .నేడు రాజులలో ఏడవతరము జరుగుతూ వున్నది . మనవాడు కూడా పూలారులలో ఏడవతరపు వాడు ;

నేడు పులారికి ఆ యాభై పైసలు కూడారావటం లేదు . ఫది ఎకరాల మాగాణి - కరణాలు వేసిన మంత్రాల వల్ల కుచించుకొని పోయి నేటికీ ముప్పావు ఎకరం అయ్యింది . ఈ పొలం మీదవచ్చే గింజలు - యాచక వృత్తిలో వచ్చే పైసలు మన వాడైన పులారికి జీవన ఆధారము .ఎప్పుడో శతాబ్దాల క్రింద రాజులు కట్టించి ఇచ్చిన గృహమే నేటికీ అతని నివాసము .

<<>>"భార్య భర్త నెత్తిన పప్పుచారు కుమ్మరించుట- బ్రహ్మ చూచుట "<<>>

పూలారి ఇల్లు శిథిలావస్థకు చేరి . పిల్లలు పడుకోవటానికి . ఆడవారి స్నానాలకు చాలా కష్టంగా వుంది . భర్త ఇంటిని బాగు చేయించ లేకపోతున్నాడు. ఈవిషయమై భార్యకు భర్త మీద కొండెత్తు కోపముగా వున్నది .ఇప్పుడు భర్తను అన్నానికి కూచో పెట్టి - ఇప్పుడెక్కడికి పోతాడో చూదాము అని ఆలోచించి - "ఏమండీ మరి ఇల్లు ఎప్పడు కట్టిస్తారు ? అని భర్తతో వాదనకు దిగింది . కోపాల కొండలు ఎక్కింది . పూలారి " ఇక వడ్డించ వే ?" అని అడిగినదే ఆలస్యముగా ఆమె ఒక చిన్నగిన్నెలోకి పప్పుచారు వంపుకొని తెచ్చి దాన్ని భర్త తల మీద దిమ్మరించింది .. భర్త ఎంతో శాంతముతో " ఎందుకే ఇంతకోపము? నెలకు ఒక్క ఏడు రూపాయలు ఆదాయము వచ్చే మార్గము కనపడనివ్వు . నీకోసం ఏడు అంతస్తుల మేడ కొనేస్తాను " అని బదులు ఇచ్చి - పెట్టినది తిని లేచాడు .

ఇది చూస్తున్న బ్రహ్మ " వీనికి నేను ఎంత సహనం రాసిపెట్టానో కదా ? ' అని ఆశర్య పోయాడు .

అప్పుడు అయన మూడు తలలోని ఒక తల " గుణములు అనునవి మనము నుదుట రాయము . మానవులు సాధన ద్వారాతమకు తాముగా గుణములను అలవర్చుకొనవలెనని మన ఆజ్ఞ " అని బదులిచ్చెను . బ్రహ్మకు మూడు తలలు వున్నందుకు ఇదీ సౌలభ్యం .

" సరే ఇంత సహన గుణము అలవర్చుకున్న ఈ పూలారికి నేను ఏదన్న మేలు చేసేది అనుకున్నాడు .

బ్రహ్మ 'అతని భార్య నుదిటి వంక చూసి - " ఈమె గొప్ప సాధ్వీ మణి కావాల్సింది "అని రాసి పెట్టాను కదా ? ఈమె ఎందుకు ఇట్లా ప్రవర్థించుచున్నది ? అని ఆశ్చర్యంపొందాడు .

దీనికి - అయన యొక్క మరొక శిరస్సు ఇట్లా బదులు ఇచ్చింది .

" సంతృప్తి వున్న స్త్రీలే సాధ్వీమణులు అవుతారు . వున్న దానిపట్ల సంతృప్తి చెందే స్త్రీలే కనుక ఉంటే - - వారి భర్తలు ఒళ్ళు వంచి పని ఎందుకు చేసెదరు ? మరింత కష్టపడి మరింత సంపాదించవలెనన్న స్ఫూర్తి , కోరిక, పురుషులలో కలుగుటకు గానూ వారికి కావాల్సిన ప్రేరణ శక్తి స్త్రీల అసంతృప్తి నుండి ఏ లభించవలెనని -- అలోచించి , మనమే, స్త్రీలకూ సంతృప్తి అన్నదే లేకుండునట్లు - వారి తల రాత లు రాయుచుంటిమి " అని బదులు చెప్పినది

<> <> బ్రహ్మ తన రాతను నిజము చేసుకొను పూనుకొనుట <><>

పూలారి భార్యను {ఆమె తలరాత ప్రకారము }సాధ్విని చేయుట అనగా ఆమె భర్తకు సంపదలు ఇవ్వ బ్రహ్మ నిర్ణయించుకొనెను [] అందుకుగాను బ్రహ్మ తన సంకల్ప ప్రభావముచే ఆ దేశపు ఏడవతరపు రాజుని పూలారి ఇంటి గుమ్మము ముందు నిలబెట్టెను .

" నెలకు ఒక్క ఏడు రూపాయలు ఆదాయము వచ్చే మార్గము కనపడనివ్వు . నీకోసం ఏడు అంతస్తుల మేడ కొనేస్తాను "అన్న" పులారి అంటున్న క్షణాన రాజు పులారి ఇంటిముందు నిలబడ్డాడు . ఈరాజుకు "వింత సంగతులు" తెలుసుకోవలెనన్న ఆసక్తిచాలా మెండు . ఈ మాటలు ఆయన చెవులలో గింగుర్లెత్తినవి .

ఆరాత్రి తరువాత రాజు పులారిని తన కొలువుకు పిలిపించుకొని " నీకు ఏడు రూపాయలతో ఉద్యోగం వేస్తున్నాము . నువ్వు ఏపని చేయతలుచుకున్నావో నీవే నిర్ణయించుకొని - దాన్ని గురించి మంత్రుల దెగ్గరనుండీ ఒక ఫర్మాన తీసుకో " అని ఆజ్ఞ్యాపించాడు .

ఈ రోజులలో ఈ రాజుకొలువులో లో అతి చిన్న జీతము యాబది రూపాయలు ." వీడు ఏడు రోపాయల్తో ఏడూ అంతస్తుల మేడ యెట్లు కట్టునో చూతము " అన్న ఆలోచనతోనే రాజు అతనికి ఏడు రూపాయల వుద్యోగం వేసెను .

<><>"సముద్ర గణితము><><>

ఉద్యోగములు ఇచ్చు మంత్రి నీకేమి వచ్చును ? అని అడిగెను . మనవాడికి ఏ శాస్త్రమూ రాదు . అతనికి తెలిసినది యొక్కటే . బ్రహ్మగుడి యొక్క మండపములో కూచుని - అక్కడనుండి కనపడు సముద్రము వంక చూచుచూ కాలము వెళ్ల బుచ్చేది .[] ఒకనాడు ఎవరో వచ్చి ' సముద్రము, గణితము ఒక్కటే " అని అన్నారు . ఇప్పుడు ఆ మాటలు గుర్తుకు వచ్చి న మనవాడు " సముద్రగణితము " అని ఢంకా భజాయించి చెప్పెను .అప్పుడు మంత్రి " నీవు ఆ శాస్త్రమునందు మరింత కృషి చేసి రాజ్యమునకు ఉపయోగపడవాల్సింది . అని చెప్పి " ఇతడు రాజానుగ్రహము పొందిన ఉద్యోగి . ప్రజలెల్లరు ఇతని మాటను మన్నింపవలెను . ఇతని విధులకు -

విధానాలకు ఎటువంటి ఆటంకము కలిగింపరాదు - ఆజ్ఞ మీరిన వారు శిక్షార్హులు " అని రాసి ఒక ఫర్మాన ఇచ్చెను . అంతే కాక" ఇది ఒక ఉద్యోగము కాబట్టి "నీవు కోమటి కొట్టుకు వెళ్లి ఫర్మానా చూపించి - ఒక చిట్టా పుస్తకము , ఒక కలము , ఒక సిరా బుడ్డి ఉచితముగా పుచ్చుకొనిపొమ్ము అని చెప్పెను .ఈ కోమటి కొట్టు ద్వారా " సముద్రము మీద ఒక ఉద్యోగి నియమింపబడినాడు అన్న వార్త " వూరిలో తెలిసినది .

మనవాడు ఎప్పటివలె బ్రహ్మ గుడిలో కమలములు సమర్పించి సముద్రము వంక చూచుచూ కూర్చుండును . ఇది వరకూ వాలే కాక ఇప్పుడు అతడు ఉద్యోగి . అందు వలన సముద్రము వంక చూచుచూ - సముద్రము వంక వచ్చి పోవుచున్న మనుషులను - సముద్రములో నుండి వచ్చి పోవుచున్న నౌకలను - నావికులను గురించి ఎదో ఒక అర్థం పర్థం లేని లెక్క రాయదొడగెను . మనవాడికి అంకెలు అన్నవి రావు . అనువల్ల కొన్ని నిలువు గీతలు కొన్ని అడ్డగీతలు , కొన్ని సున్నాలు కొన్ని స్వస్తికాలు , కొన్ని పద్మాలు కొన్ని నక్షత్రాలు వంటి గుర్తులు వుపయోగించి చేతికి తోచినది రాసేను . నెల చివరన జీతము ఇచ్చు మంత్రి , చిట్టా చూసి " ఎదో గొప్ప శాస్త్రము తయారు అగుచున్నది " అని భావించి - మనవాడిని ప్రోత్సహించెను . దీని తరువాత ముందుగా రాజవుద్యోగులు - ఆ తరువాత సాధారణ ప్రజలూ " సముద్రము మీద నియమింపబడిన రాజవుద్యోగి - సముద్రము మీద జరుగుచున్న ప్రతివిషయమును - రహశ్య భాషలో ఎదో నమోదుచేసి - రాజుకు నివేదిక ఇవ్వనున్నాడని చెప్పుకొనిరి.

ఏది ఏమయినా మన వాడికి భార్య పోరు వదిలిన్ది కాదు . నేడు కూడా భార్యల పోరు పడలేని వారు - ఉద్యోగ ము చేయు చోటనే ఎట్లు తల దాచుకుందురో , అదే రకముగా మనవాడు కూడా రాత్రియంబగళ్లు - గుడి మండపము మీదనే గడుపుచూ ఉద్యోగము చేయు చుండును .సముద్రము మీద వర్తకము చేయు వారు ఇదంతా గమనించుతూ ఉండిరి . వారికి చెందిన కొన్ని రహస్య ఓడలు అర్ధరాత్రి వేళా రహస్యమైన సరుకులతో తీరమునకు వచ్చి పోవుట కలదు . వీటి మీద రాజుకు చెల్లించవలసిన పన్నులు ఎగ వేయబడుచూ వున్నవి . ఈ ఎగవేత వాళ్ళ వారు విపరీతమైన లాభములు తీయుచూ ఉండిరి .

వారు వచ్చి , మనవాడిని కలిసి " కేవలం ఏడూ రూపాయల జీతము కోసము నీవు రేయింబగళ్లు ఏల ఉద్యోగము చేయుచుండివి? " అని అడిగిరి .

"నాకు మొదటి నెల జీతముగా ఏడూ రూపాయలు చేతిలో పడగానే - ఏడంతస్తుల మేడ కొని ఇచ్చెదనని నా భార్యకు చెప్పితిని . జీతము వచ్చినా గానీ ఇల్లు కొనలేదని నాభార్య నన్ను శత పొరుచున్నది . ఇంటిలోని పోరు పడలేక నేను ఇక్కడనే పడి ఉంటున్నాను " అని నిజము చెప్పెను [] వర్తకు లందరూ కూడపలుక్కొని - డెబ్బది వేలు వెచ్చించి - ఒక ఏడు అంతస్థుల మేడని కొని , తెలివిగా అలోచించి - మనవాడి భార్యకు ఇట్లు కబురంపిరి " ఏడు రూపాయలకు మా భవనము మీకు అమ్మతలచితిమి" అని [] ఆమె వచ్చి అంతా చూసి - వాస్తు బాగానే వున్నదని అనుకోని - బట్టలు ఉతికి ఆర వేయుటకు మంచి వసతి కలదని తృప్తి పడి - తులసెమ్మను పెట్టుకొను చోటుకలదు అని మురిసి - ఇంటిని కొనుటకు అంగీకరించింది [] పట్టణ ప్రజలందరూ చూచు చుండగా - పులారి నుండి ఏడు

రూపాయలు తీసుకొన్న వర్తకులు - ఆ ఏడంతస్తుల మేడను అతనికి అమ్మినట్లు ప్రకటించిరి . ఆ నాటినుండీ అది " ఏడు రూపాయల ఏడంతస్తుల మేడ" అయినది

<><> మన వాడు రాజు దెగ్గర చిన్న మంత్రి అగుట <><>

ఏడు రూపాయల ఏడంతస్తుల మేడగురించి రాజుకు తెలిసినది . ఆయనకు ఆసక్తి కరమైన కబుర్లు అందించు వారు - ఈ కబురు అందించిరి .

" వారు ఏడు రూపాయలకు వీడి కి ఒక ఏడంతస్తుల మేడ అమ్మినారన్న - రాజ్యము తరఫున - వీడు వారిని అంతగా ఎట్లు దడిపించెనో ? వారు చేయు రహస్య కార్యములను వీడేమి కనుగొనేనో - ఏమి చూశానో ? అని అలోచించి పులారి ని తన ముందుకు పిలిపించుకొని - విషయము వివరించమని అడిగే.

మనవాడు చిట్టా విప్పి విచిత్రమైన గుర్తులు చూపుచూ , తనకు వచ్చిన కలలు, గుర్తుకు వచ్చిన విచిత్రమైన ఓడరేవు యొక్క సంగతులు మిళాయించి చెప్పెను . అంతా కాక కొంత విన్న పిదప " రాజు గారు " చీకటి మాటున జరుగుచున్న వర్తకము , దానికి పాల్పడిన వర్తకులు, మొదలగు వాటి గురించి వివరములు మనవాడు తేదీ మరియు నిమిషముల వారీగా ఎన్నో రహస్య వివరములు నమోదు చేసి వున్నాడు . దీని సాక్ష్యముగా నేను చర్యలు చేపట్ట వచ్చు "అనిభావించి - ఓడరేవు ఉద్యోగులందరినీ ఉద్యోగము నుండి తొలగించి కొత్త వారిని పెట్టెను .

ఆ నియామకపు పని పూలారి ఏ చూచెను. ఈ తరువాత ఓడరేవునుండి రోజూవారీగా రాజుకు వచ్చు ఆదాయము ఒక లక్ష రూపాయలు అదనము అయినది అని కోశాధి కారి రాజుకు చెప్పెను [] దీనితో మనవాడు రాజుకు ఒక చిన్న మంత్రి అయ్యెను []

ఇక్కడితో ఈ కదా అయిపొయిందిఅంటే అయిపోయి నట్లే - కానీ ఇంతవరకూ జరిగినదంతా మన వాడి భార్యను మెత్తపరిచి ఆమెను సాధ్విగా మార్చుటకు బ్రహ్మచేసిన ప్రయత్నమే అనవచ్చును .

<>నూట ఒక్క రాళ్ల కథ <>

మనవాడు చిన్నగా మంత్రికాగానే - రాజును ప్రోత్సహించి - పాడుపడి రాళ్లు ఊడి కిందపడుచు శిధిలా వస్తకు చేరుచున్న బ్రహ్మగుడిని పునర్నిర్మింప చేయు నట్లు చేసెను .

ఒకనాడు కట్టు బడి దారులు వచ్చి " ఆలయ పునర్ నిర్మాణము సంపూర్ణమైనది . ఎందువల్లనో కానీ నూట ఒక్క శిలలు మిగిలినవి . వాటి మీద వింత గుర్తులు వింత బొమ్మలు వున్నవి . వాటిని ఆలయములో ఎక్కడ ఇమిడ్చినా గాని - తిరిగి పెల్లగించుకొని వచ్చి బయటకు పడుచున్నవి" అని చెప్పిరి

రాజుకు ఆసక్తి మెందుకదా ? అయన బహు శాస్త్రములు చదివిన వారిని పిలిపించి - వివరము ఏమిటి అని అడిగెను

వారిలోని నాలాంటి వాడు ఒకడు ఇట్లనెను " మీ పూర్వీకులకు పూర్వీకులైన మొదటి తరము రాజుగారు - ఈ ఆలయమును నిర్మించి - బ్రహ్మ విద్యా మూలకంగా ఒక రాక్షషిని స్వాధీన పరుచుకొని ఆ కొలనులోకి ప్రవేశపెట్టి, రాజ్యము మీదకు ఎవరన్నా దండయెత్తి వచ్చినప్పుడు వారికి తగిన గుణ పాఠము నేర్పుటకు ఈ రాక్షసిని ఉపయోగించుకొనుటకు నిశ్చయము చేసి పెట్టెను . ఈ రాక్షసి ఎంతో సహన స్వభావము వున్నా వారి మాట కానీ వినదు . గొప్ప సహన స్వభావము లేని వారు లేని పోనీ కోపము తెచ్చుకుని తన ద్వారా లోకమును పీడింతురేమో ననీ దాని ఆలోచన " మంచి సహన స్వభావము కలవారు ఎవ్వరో కనుగొనవలనని - మన మొదటి తరపు రాజుగాబు ఒక పులారిని ఏర్పాటు చేసిరి . ఎవ్వరూ రాని ,ఏ ఆదరణ లేని , ఏదన్న కానుకలు వచ్చును అన్న ఆశలేని గుడికి పులారిగా ఉండుటకు , ఒంటరిగా కాలము గడుపుటకు ఎవరికైనను ఎంతో సహనము కావలేకదా ?

ఆ నాటి నుండి నేటి పులారి వరకు అందరూ ఎంతో సహన గుణము ప్రదర్శించిరి . అందువల్లే ఇతను తనకు వచ్చు అర్ధ రూపాయ జీతము అందకున్నను , భూమి కుంచించుకు పోయినా నోరు మెదపలేక పొయను. ఇప్పుడు మనకు దొరికిన నూట ఒక్క శిలలను ఎవరైనా ఒక సహనగుణ సంపన్నుని చే కొలనులోకి వేయించినచో - నీటిలో వున్నా ఆ రాక్షసి కి ఈ రాళ్లు మామిడి పండ్ల వాలే రుచించును [] ఆ రాళ్ళని తిని - సంతృప్తి చెంది - బయటికి వచ్చి న రాక్షసి తనకు ఆహారము ఇచ్చిన వారి మాటను మన్నించి వారు చెప్పిన పని చేయును "అని చెప్పెనెను .

ఇప్పుడు చూసిన - బ్రహ్మ కు ఆలయము ఎందుకు కట్ట బడినది అందులో ఒక పులారి ఎందుకు నియమింపబడినాడు ? అన్నది మనకు తెలియును .

<> " దైవనిర్ణయకము " అను రాక్షషుడు వచ్చుడు <>

ఇదే సమయమున నలుగురు శత్రు రాజులు కూడపలుక్కొని - మనవాడి రాజుయొక్క రాజ్యము మీదకు దండెత్తి వచ్చిరి . పండితులు మంత్రములు చదువగా మనవాడునోటొక్క శిలలనూ కొలనులో వేసెను . అప్పుడు " దైవనిర్ణయకము " అను రాక్షసుడు బయటికి వచ్చును . అతడు లంభిణికి అన్న అనునట్లు ఉండెను .ఇతను ఎవరినీ చంపి తినడు . పండ్లు మాత్రమే తిను వాడు - మానవులను నోటిలోకి పీల్చుకొని వారిని నడి సముద్రములోనికి ఉమ్మును . ఇట్లు చేయుటవలన - బ్రహ్మనిర్ణయము ప్రకారము ఆయువు మూడిన వారు మాత్రమే నడిసముద్రములో మునిగి మరణించుదురు . మిగిలిన వారు చావు బ్రతుకులమధ్య తీరము చేరి - భయ భక్తులతో బుద్ధిగా బ్రతుకుదురు .ఇదీ ఆ రాక్షసుని మనస్సు .

మన పులారి "దైవనిర్ణయకము" నకు శత్రు సైన్యము నంతటిని చూపి వారిని మింగుము అని చెప్పెను. రాక్షషుడువారిని అందరిని పిల్చి మింగి సముద్రములోనికి ఉమిసెను . మరణము రాసివున్నవారు మరణించిరి. మిగతా వారు చావు బ్రతుకుల మధ్య అలలపై తేలుచు వేరు వేరు దూర తీరములకు చేరిరి . యుద్ధము అన్నది లేకనే అంతయూ శాంతి అయ్యేను .

ఈ ఘటన తరువాత మనవాడి రాజుకు ఎదురు లేకపోయినది . ఎక్కడెక్కడి రాజులు ఇది విని భయపడిపోయి - ఈ రాజునకు కప్పములు కట్టి లొంగిపోయిరి . రాజుగొప్ప చెక్ర - వర్తి అయ్యేను

మనవాడు ముఖ్యాతి ముఖ్య మంత్రి అయ్యేను .

ఆనాడు ఆ భార్య పప్పుచారుతోతన భర్తను అభిషేకించుటచేతనే ఇదంతా జరప వలిసి వచ్చినది కదా? అనితలుచుకొని బ్రహ్మ - సరస్వతులూ పడీ పడీ నవ్వుకొనిరి .

కధ సంతృప్తి క్రమంగా లేదా ? అయినచో మరింత ఇమ్మని బ్రహ్మకు మొక్కుడు .శాంతము సముద్రముకన్న పెద్దది అని ఒక లారీ వెనుక రాసివుండగా నా చిన్నప్పుడు చదివితిని . నేడు చెప్పితిని .

**a original by varanasi sree ramakrishna**